# DURANTHAMA?

(An Andhra Social Story)



V. N

B.

[రెం 4 అణాలు

The Proceeds of this Book will go to tl
funds of the National High School, Adyar, Madra

ఈ గ్రంథముమీద వచ్చు ఆదాయ మంతయు, అడయారు జాతీ
విద్యాలయ వ్యయములకు వినియోగింపబడును.

# దురంతమా?

(ఒక చిన్ని సాంఘికనవల)

అడయారు జాతీయవిద్యాలయమున

చరిత్రోపాధ్యాయులును, సాహిత్యసదస్యులును నగు

**వి. ఎక్స్. శర్మ, బి. ఏ., బి. టి. గారిచే**

వ్రాయబడినది

చెన్నపురి:

ఆంధ్రపత్రికా **ముద్రాలయమున**

ముద్రింపబడినది

**1923**



[వెల **4** అణాలు

# అంకితము

నా మిత్రులును చెలికాండ్రును

నగు

అడయారు జాతీయవిద్యాలయమునందలి

ఉపాధ్యాయులకును విద్యార్థులకును

ఈ చిన్ని సాంఘికనవలను

ప్రీతిపూర్వకముగ సమర్పించుచున్నాను.

# విజ్ఞప్తి

ప్రస్తుతపు సాంఘికసమస్యలను, ఆబాలగోపాలమున కర్థమగు విధముగ వ్రాయబడు గ్రంథములు మనభాషలో అంతగ లేవు. ఈకొఱంతను దీర్చి నాదేశీయులకు శక్తిమంతముగ సేవచేయుటకుగాను, కృతబద్ధుడనై, 1918 సం॥ వేసవికాలమున, వంగభాషలో కొంతకాలముక్రిందట ప్రమథనాథ ముఖర్జీగారు వ్రాసినకథను మూలికగా గైకొని, చాలవఱకు పెంచి, ఆంధ్రదేశపరిస్థితులకు సమన్వయముచేసి దీనిని రచించితిని. తరువాత కొంతకాలమునకు మిత్రుల ప్రోత్సాహమున, నిఖిలభారత సాహిత్యసంఘమువారి నవలారచన పరీక్షకుగాను బంపవలసిన మూడుకథలలో నొకదానిగా దీనిని బంపితిని. సంఘమువారు నా యీ సాంఘిక నవలారచనయందలి యీ ప్రథమ ప్రయత్నమునకు కేలూత నిచ్చి, "సాహిత్యసరస్వతి" యనుబిరుదము నిచ్చి సత్కరించినందులకు వారి కెంతయు కృతజ్ఞుడను.

గ్రంథరచనలో నాకు తగినసలహాల నిచ్చుటయే గాక చిన్ననాటనుండియు నా ప్రయత్నముల కన్నిటికిని కేలూతనిచ్చుచు, సహాయము చేయుచున్న శ్రీ దేశబాంధవ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారిపట్ల నే నెంతయో కృతజ్ఞుడను. శ్రీ పంతులుగారి ధనసహాయము లేకయున్న యెడల ఈగ్రంథము వెలువడియుండెడిదియే గాదు. వారి ఋణమును నే నేవిధముగ తీర్చుకొనగలనో తెలియకున్నది. శ్రీవారి కాయురారోగ్యముల నిచ్చి, వారి సేవావ్రతమునకు సర్వవిధముల తోడ్పడుగాత యని శ్రీమన్నారాయణుని ప్రార్థించుచున్నాను.

అడయారు<br>**13-4-23**

విధేయుడు,<br>వి. ఎస్. శర్మ.

# దురంతమా?

## (సాంఘిక నవల)

### మొదటి ప్రకరణము

సాయంకాల మైనది. ఒంగోలు రైలు స్టేషనునందలి యొక గదియం దిరువురు గూరుచుండి మాట లాడుకొనుచుండిరి.

"రావుగారూ! మీ రేమియు భయపడ నక్కఱలేదు. కుఱ్ఱవాని కేమియు తొందరలేదు. నా వెంట నెవరినైన బంపిన కుఱ్ఱవానికి మాత్రల నిచ్చెదను. వానిని నేటిరాత్రి రేపుదయము ఇయ్యండి."

"తాము ధన్వంతరు లనియే చెప్పవచ్చునండి. తమరు చెప్పు ధైర్యమే చాలునండి. రాముడొక్కడె మాకు ప్రాణము. తల్లి వానిని కడు గారాబమున పెంచినది. అందువలన వానిస్థితిని చూచి తల్లి సతతము కంట నీరుపెట్టుకొనియున్నది. నిన్నటిరాత్రి రాముని స్థితి యేవిధముగ నైనది చెప్ప నక్కఱ లేదుగదా! వానిమీద ఆసనే వదలుకొంటిమి. తమ రంపిన

మందు చాల గుణ మిచ్చినది. వాని ప్రాణముల రక్షించు భారము మీాయందే గలదు" అని యువకు డొకడు చొక్కా జేబులోనుండి పదిరూపాయలనోటును దీసి డాక్టరుగారి కీయ బోయెను. డాక్టరుగారు దానిని పుచ్చుకొనక,

"ఈ వేషాలంతా యేమిటోయీా? డబ్బుకొఱకు మీాకు వైద్యము చేసెదననుకొనుచున్నావా? మీాపరిస్థితులు నాకు బాగుగా తెలియును. నే నాసొమ్మును ముట్టను" అని పలికెను.

"తాము మాపట్ల చూపు వాత్సల్యమున కెంతయు కృతజ్ఞులమండి. తాము మాకుఱ్ఱవానిని రక్షించుటకు పడిన శ్రమకు మేము ప్రతిఫలము చూపకపోయిన కృతఘ్నుల మగుదు మండి"

"అలాంటిమాట లెన్నటికిని అనవద్దు. అబ్బాయి జబ్బు నిమ్మళము కానీయండి. ప్రతిఫలముయొక్కవిషయము తరువాత ఆలోచించుకొందము" అని డాక్టరుగారనిరి. డాక్టరుగారు పేద వారియొద్దనుండి కాసైన ముట్టక వైద్యము చేయ బద్ధకంక ణము కట్టుకొనినమహానీయులు. యువకుడు స్టేషనులో నొక చిన్నయుద్యోగి. అందువలన డాక్టరుగా రాయువకునియొద్ద నుండి యేమియు పుచ్చుకొనగూడదని తీర్మానించుకొనెను.

వీరిట్లు మాటలాడుకొనుచుండ ప్లాటుఫారముమీాద సందడిగ నుండెను. వందలకొలదిప్రజలు గుమిగూడి జయ

నాదముల జేయుచుండిరి. డాక్టరుగా రీ సందడిని విని "రావు గారూ! ఆసందడి ఏమిటి?" అని ప్రశ్నించెను.

"గుంటూరునుండి మొన్నటిదినము మనయూరికి పంతులు గారు వచ్చియుండిరిగదా? బహుశః, వారిని సాగనంపుటకు వచ్చిన పురవాసుల సందడి యని తలంచెదను" అని లక్ష్మీ కాంతారావుగారు ప్రత్యుత్తర మిచ్చిరి.

ప్రేక్షకులను చూచుటకుగాను మనమిత్రు లిరువురు ప్లాటుఫారముమీదికి వచ్చిరి. లక్ష్మీకాంతారావుగారు తలంచి నటులు పంతులుగారిని సాగనంపుటకే ఆపురవాసు లనేకులు స్టేషనుకు వచ్చి ప్లాటుఫారముమీద జయనాదములు చేయుచు పచారు చేయుచుండిరి. గుంటూరునుండి వచ్చిన పంతులుగారు ప్రఖ్యాత స్వరాజ్యపత్రికా సంపాదకులు. వీరిని ఆంధ్రదేశ మున ఎఱుగని వారెవరును లేరు. స్వదేశోద్యమమును గురించి వీ రిచ్చు ఉపన్యాసముల వినుటకు దూరగ్రామములనుండి సైతము ప్రజలు తండోపతండములుగ వచ్చుచుండురని చెప్పుట యొకగొప్ప కాదు. డాక్టరు కృష్ణారావు నాయుడుగారు ప్రభుత్వోద్యోగి యైనను స్వదేశోద్యమముపట్ల అభిమానము మెండు. వారియింట స్వదేశమున చేయబడిన వస్తువులనే యుపయోగింతురు. అందువలన అధికారులలో ననేకుల కితని మీద తలకంటకముగ నుండెను. పంతులుగారి ప్రఖ్యాతిని డాక్టరుగారు పెక్కుసార్లు వినియుండెను. కాని, ఆయనగారి

దర్శనముమాత్ర మింతవఱకు చేసియుండలేదు. ఇప్పు డాయ
నను దర్శించి మాటలాడుటకు అవకాశముండునని తలంచెను.
గుంపులోనుండి సందుచేసికొని పంతులుగారియొద్దకు వెళ్లి
నమస్కరించెను. వా రిరువురును కొంత సేపటివఱకు మాట
లాడుకొనుచుండిరి. ఇంతలో రైలుబండి స్టేషనులోనికి వచ్చెను.
వెంటనే పంతులుగారు రెండవతరగతి బండిలో తమ సామాను
నెక్కించుటకుగాను, ఒకగదితలుపును దీసి లోనికి పోసాగిరి.
లోపల హాయిగ పండుకొని వార్తాపత్రికను చదువుకొను
చున్న యొక ప్రయాణికుడు తనస్థలమునుండి లేచి గదితలుపున
కడ్డమువచ్చి "ఇది నల్లవాండ్రబండి కాదు. ఇంకొకపెట్టె
లోనికి వెళ్లుండి" అని బిగ్గరగా నఱచెను.

"తనుసలహా మంచిదే? నా రూపాయలుగూడ నల్లని
వని తలంచెదరా? మీ రీబండి నెక్కుట కెంతస్వాతంత్ర్యము
గలదో అంతస్వాతంత్ర్యము నాకును గలదు." అనుచు ఆ
ప్రయాణికునిమాటల నరకుగొనక లోని కెక్కుటకు నడుగు
బెట్టెను.

ఈ సాహసకార్యమునకు మనమిత్రుడు, ప్రయాణికుడు
సహింపజాలక పోయెను. అతడా శ్వేతముఖుడు. రాజబంధువు.
గొప్పయుద్యోగి. నల్లవాండ్రెపుడు అతనిపాదముల నొత్తుచు
సేవ చేయుచుండెడివారు. నల్లవాండ్రెపుడును తెల్లవారి
మాటల కడ్డుచెప్పుట కలలోనైన ఈ మహానీయుడు గాంచి

యుండినవాడు కాదు. అట్టి పరిస్థితులలో నల్లవాడొకడు తన మాటల కడ్డుచెప్పుట చూచి ఆతని యొడలు మండసాగెను. ముఖ మంతయు కందిపోయెను. బండిలో గూర్చుండుటకు లోనికి రాబోవు చున్న పంతులుగారిని బలాత్కారముగ వెనుకకు నెట్టివైచెను. పంతులుగారు గంభీరోపన్యాసముల నియ్యగలరు. లక్షలకొలది ప్రజలను తనమాట ప్రకారము నడిపింపగల శక్తి గలదు. కాని అంతబలవంతుడు గాడు. ఆ తెల్లవాని దెబ్బ తాళజాలక క్రింద బడెను. ఈ దారుణకృత్యమును కన్నులార చూచుచున్న ప్రజలచిత్తమా సమయమున ఏవిధముగ నుండెనో వర్ణించుట అనవసరము. తమనాయకుని శ్వేతముఖు డిట్లు లవమానించుట చూచి సహింపజాలక పోయిరి. కుర్రవాండ్రు కొందఱు చేతులు చేసికొని దొరగారిని బలాత్కారముగా బండిలోనుండి వెలుపలికి లాగిరి. మఱికొందఱు ఆతనిని దేహానుగ్రహము చేసిరి. అల్లరిని చూచి రైలు గార్డు నిశ్చేష్టుడయ్యెను. నిమేషకాలమైన నచ్చట నిలుచుట కాతనికి కాలాడలేదు. ఇక పోలీసువారి సంగతి చెప్పనక్కఱ లేదు. వారేదో పనిలో నిమగ్నులై యుండి, ఆ స్థలమువైపునకే అడుగుపెట్టినవారు కారు. ఇంతలో పచ్చ జండా చూపబడెను. రైలుబండి కదలెను.

రైలుబండి స్టేషనులోనుండి బయలుదేరిన తదనంతరము ప్రజలొకరొకరుగ ఇండ్లదారి బట్టిరి. దొరగారిచుట్టును కొంత మంది ప్రజలు మూగియుండిరి. ఇంతవఱకు తమతమ కార్య

ములలో నిమగ్నులై యున్న పోలీసుబంట్రౌతులు కొందఱు ప్రజలను నానాదిక్కులకు చెదరగొట్టి దొరగారిని సురక్షితమగు నొకస్థానమున నుంచిరి. స్టేషనులోనే యున్న డాక్టరుగారిని బిలుచుకొని వచ్చిరి. డాక్టరుగారు దొరగారిని పరీక్షించి అత నికి బలమైనగాయములు తగిలినవనియు, వెంటనే చికిత్సాలయ మునకు బంపు డనియు నాజ్ఞాపించిరి.

సంగతిసందర్భము లిట్లుండ, మనపంతులుగారు రైలెక్కి స్వగ్రామమునకు సురక్షితముగ చేరిరి. మరునాడు తమపత్రిక యందు, మనదేశమున శ్వేతముఖులు ప్రజలను బెట్టుచున్న బాధలనుగురించి ప్రధానవ్యాసమును వ్రాసిరి. రెండుమూడు రోజులలోనే ఈదురంతము దేశమునంతటను వ్యాపించిన దని వ్రాయుట అనవసరము.

## రెండవ ప్రకరణము

ఒంగోలునందలి ప్రభుత్వమువారి చికిత్సాలయమున డాక్టరు జోస్యుల కృష్ణారావునాయుడు ఎల్. ఎం. ఎస్ గారు ప్రధానవైద్యులు. డాక్టరుగారు శాంతమూర్తులు. పేదవారి కష్టసుఖముల నరయుటలో వారికి పెట్టినది పేరు. వైద్యమున డాక్టరుగారు అతిసమర్థులని పేరుగాంచినందున, చికిత్సార్థమై వారియొద్దకు వచ్చు రోగులసంఖ్య ఇంతంతయని చెప్పుట కష్ట

తరము. భోజనము చేయుటకు సైతము వారికి విశ్రాంతి యుండుట లేదని ఆ పురవాసు లనుకొనుచుండువారు.

డాక్టరుగారికి ఇరువురు పుత్రులు గలరు. పెద్దవాడగు సూర్యప్రకాశము బందరునందలి జాతీయకళాశాలలో పట్ట పరీక్షకు చదువుచుండెను. సూర్యప్రసాదము చిన్నవాడు. ఆ పురమునందలి జాతీయవిద్యాలయమున ఏడవతరగతియందు చదువుచుండెను. వేసవిసెలవులకు కలాశాలకు సెలవులీయబడి నందున సూర్యప్రకాశము ప్రస్తుతము తండ్రిగారియొద్దనే యుండెను ప్రకాశమునకీమధ్యనే వివాహమైనందున, అతని భార్య సైతము ఇప్పుడు అత్తగారియింటనే యున్నది.

నేనుదయము డాక్టరుగారింటికి వెళ్లినప్పటికి పండ్రెండు గంటలకు పైగా నైనది.

"నాన్నగారూ! ఆదొర కెట్లున్నది?" అని సూర్యప్రకాశము తండ్రిగారింటిలో నడుగుబెట్టగనే ప్రశ్నించెను.

"కొంచెము నింపాదిగానున్నది. పాపము! అతనికి తల మీద మంచిదెబ్బలు తగిలినవి. అవి నయమగుటకు రెండు మూడు నెల లగు నని తలంచెదను."

"వానికి బుద్ధివచ్చునట్లు చేసినారండి! ఏమంటారు నాన్నగారూ! శ్వేతముఖు డైనందున తానొక పెద్దగవర్నరునని తలంచుచున్నాడు."

ఈ మాటలకు డాక్టరుగారు కొంతసేపటివరకు ప్రత్యు త్తరమీయక యూరకయుండెను. తరువాత కొంతసేపటికి "అబ్బాయీ! దొరగారే గొప్ప నేరము చేసినారనుకొనుము. అందులకుగాను ప్రజలందరు దొమ్మిగా పడి ఆతనిని చావ దన్నుట న్యాయమా? ప్రస్తుత అసహాయోద్యమ ధర్మ సూత్రముల కిది విరుద్ధముగదా! మహాత్ముని కీసంగతి తెలిసిన నెంతయో విచారించునుగదా! నాదేశీయులు చేయుచున్న యీదుండగముల కెంతయు సిగ్గగుచున్నది" అని పలికిరి.

"నాన్నగారూ! మీరు చెప్పినదంతయు నిజమే. అట్టిచో శ్వేతముఖులకును మనకును సక్రమమైనపోరాట మెప్పటికిని సాధ్యము కాజాలదు."

"సాధ్యము కావలయునని యెందులకు వాంఛింపగూడదు?"

"అటులు సంభవించుట ప్రకృతిస్వభావమునకు వైప రీత్యము. పోనీయండి. ఈకేసులో విచారణ యున్నను మన వైపువాదము వినువారేరి?"

"అబ్బాయి! నీ మాటలు నా కర్థమగుటలేదు. ఎవ రైన మన కన్యాయము చేసిన వారిపట్ల కసి తీర్చుకొనుట న్యాయ మని మెచ్చుట గలదో చూపుము."

ఈ ప్రశ్న కేమి జవాబిత్తుమా యని ప్రకాశమునకు తోచక, కొంతసేపటికి "నాన్నగారూ! ఈవిషయమున నొక కార్యముయొక్క న్యాయాన్యాయములు సంఖ్యనుబట్టి నిర్ణ

యించుట కష్టతరము. మనమే ఈనేరము చేసిన గతిమోక్షములు లేవుగదా! అతనికన్ననో అధికారవర్గ మంతయు ఎట్టి సహాయ మైనను చేయుటకు సంసిద్ధమై యుండగలదు."

"ప్రకాశం! నీ వీ కువాదముతో భారతసంతతికంతయు అప్రతిష్ఠ దెచ్చుచున్నావని తెలియునా? శ్వేతముఖులు సైతము మనవలెనే మానవకోటిలోనివారు. మానవధర్మ సూత్రములు మనవలెనే వారికి సైతము అన్వయించును. వారిలో నొకరు తాను రాజబంధువు ననిగాని, గవర్నరు ననిగాని చంకలు గొట్టుకొనిన బల మేమైన వచ్చునా?"

"అతనిదేహమునకు బలము రాకపోయినను మానసము మాత్రము బలిష్టవంతమగు నను విషయము తమకు తెలియదా?"

దీనికి జవా బొసంగుటకు డాక్టరుగారి కేమియు తోచ లేదు. తరువాత కొంతసేపటికి "అబ్బాయీ! నీవు చెప్పిన దానిలో నిజ మేమాత్రము లేదని నేను చెప్పను. ఏజాతికి చెందినవారైనను, మనవా రొకనిని కొట్టుట కేమాత్రము కష్ట ముండజాలదు. మనవారిని సైతము, వారివలెనే ప్రోత్సాహ మొసంగువారు చాలమంది గలరు. మనవారే..........."

అని డాక్టరుగా రేమియో చెప్పబోవుచుండ, ఇంతలో, వారి కొరకు కెవరో వచ్చి వేచియున్నా రని కబురువచ్చెను. వారిరువురు వచ్చిన ప్రేక్షకుని చూచుటకు వెలుపలికి వెళ్లిరి.

---

## మూడవ ప్రకరణము

---

ఒంగోలు అధికారవర్గమువారికి పుట్టినిల్లని చెప్ప వచ్చును. రెండు తాలూకాలను పాలించు నుద్యోగుల కార్యాలయము లిచ్చటనే గలవు. కాశ్వనాధరగారిపట్ల పుర వాసులు చూపెట్టిన దురంతమునకు వారి కోపము మండిపో వుచుండెను. వారిలో ప్రధానులగు కలెక్టరుగారి విషయము చెప్పనక్కరలేదు గదా! నేరస్థులను తత్క్షణమే పట్టితెండని పోలీసు ఉద్యోగుల కాజ్ఞాపించెను. పోలీసు ఇన్స్పెక్టరు రామలింగముగారు కలెక్టరుగారి యుత్తరువులను శిరసా వహించి కార్యక్రమమునకు పూనుకొనెను. పోలీసుబంట్రో తులకు గత రెండుమూడుదినములనుండి చేతులకు కావలసి నంత పని గలిగినదని పురవాసు లనుకొనుచుండిరి. ఏ సందు గొందులలో చూచినను వారిమూర్తులు ప్రతిఫలించుచుండెను. ప్రఖ్యాతన్యాయవాదులు, వర్తకులు, ఉపాధ్యాయులు, విద్యా ర్థులు మొదలగువా రనేకులు అరెస్టుచేయబడి ఖైదులో నుంచ బడిరి.

దురంతము జరిగిన నాలుగుదినములకు తరువాత డాక్టరు కృష్ణారావునాయుడుగారు తమ గృహమున గూర్చుండి వార్తాపత్రిక నొకదానిని చదువుకొనుచుండిరి. ఇన్స్పెక్టరు రామలింగముగారు ఆ సమయమున వా రున్నగదిలో ప్రవేశిం

చిరి. డాక్టరుగారు వారి కుశలప్రశ్నల నడిగిన యనంతరము లోకాభిరామాయణమును కొంతసేపటివఱకు మాటలాడు కొనుచుండిరి. తరువాత కొంతసేపటికి రామలింగముగారు,

“డాక్టరుగారూ! నాయుద్యోగము నిలుచుటయే చాల కష్టతరముగా నున్నదండీ” అనిరి.

“ఎందుల కాలాగున అనుచున్నారు? కారణ మేమి?”

“కాక్సుదొరగారి కేసువలన నా కేమియు తోచలేదండి.”

డాక్టరుగారు చిఱునగవుతో “తోచుట లేదా? నేరస్థులాదటి! అరెస్టుచేసినారని పట్టణములో ననుకొనుచున్నారే?” అని పలికిరి.

“అవునండి. అయినను వారిమీద నేరమును మోపుటకు కావలసినంత సాక్ష్య మింకను మాకు దొరకలేదు.”

“వారిమీద నేరము రుజువు కాకపోతే వారి నెందుల కన్యాయముగా బంధించిరి?”

“అయ్యా, మీ రీ విషయమున తొందరపడ నక్కఱ లేదు. వారు నేరస్థులు కాకపోయిన ఖైదులో నెందుల కుంచెదము? వారు అధికారులను పెట్టుకొందరలు మీకు తెలిసియే యున్నవిగదా! కలెక్టరుగారిని చూచిన వారి కెట్టి భయమైన గలదా! ఎప్పుడును పట్టణములో ఏదో యొకగోల చేయుచుందురు. వారికి తగిన శాంతి చేసినగాని లాభము లేదు.”

"ఈ కారణములమీదనేనా వారిని బంధించితిరి?"

"లేదండి. లేదు. మేమంత తెలివితక్కువవార మను కొనుచున్నారా? కాన్పుదొరగారిని తన్నుటలో వారందఱు పాల్గొనిరని మాకు కావలసినంత సాక్ష్యము గలదు. అయినను ఆ పాదు పీనలుకోర్టులో చెప్పబడిన,విశ్వసనీయు లగు సాక్ష్యులు మాత్రము మాకింతవరకును దొరకలేదు."

"ఎవరో ఎల్లాయల, పుల్లాయల మాటలమీదనేనా వారిని పట్టుకొనినది? ఈ విషయమున మీ ప్రవర్తన అంత బాగుగా లేదండి. వారిని వెంటనే ఖైదునుండి విడుదలచేసిన గాని మీ గౌరవము నిలువదు."

"వారినే విడుదలచేసిన నాయుద్యోగమునకు నీళ్లుచల్లు కొనవలసినదే? కేసువిచారణ ప్రారంభ మగుట కింక రెండు దినములు మాత్రము వ్యవధిగలదు. అందువలననే మీ దర్శ నముకొఱకు ఇచ్చటికి వచ్చితిని.?"

"ఈ విషయమున నాతో మీ కేమిపని గలదు? నే నిందులో ఎట్టి సహాయమును చేయగలను?" అని ఆశ్చర్య ముతో డాక్టరుగారు పలికిరి.

రామలింగము పిళ్లగారు ఎంతో వినయముతో "నా యుడుగారు! తలంచుకొనిన మీ రెంతపనినైన చేయుగలరు? మీ రానేరకాలమున స్టేషనులోనే యున్నారుగదా! మీ సాక్ష్యమువలన కేసునకు చాలబలము చేకూరగలదు" అనెను.

"అల్లరి జరుగునప్పుడు నే నచ్చట లేనే. స్టేషను ఉద్యోగస్థులలో నొకరియింట జబ్బుగా నున్నందున, రోగిని చూచుటకు వెళ్లియుంటిని. అప్పుడు మీ బంట్రౌతులు కొందఱు నాదగ్గఱకు వచ్చి సంగతిసందర్భములు చెప్పగా, దొరగారిని చూచుటకు స్టేషనులోనికి వెళ్లితిని. అప్పటికి రైల్వేయుద్యోగులుతప్ప మఱెవరు నచ్చట లేరు. దొరగారిని కొట్టినవారు ఫలానివారని నా కేమి తెలియును" అని డాక్టరుగా రనిరి.

డాక్టరుగారు చెప్పు ఈ మాటలు వినుచు పిళ్లగారు కొంచెము సేపటివఱకు ఏమియు తెలియనివానివలె నూరకుండి "ఆలాగునాండీ! అయితే నాకు తెలిసినసంగతి తప్పయియుండును. ఈ సంగతి నాకు ముందుగ తెలిసియుండిన ఎంతయో బాగుండెడిదిగదా!" అని యింకను నేమియో చెప్పబోవుచుండెను.

"పిళ్లగారు! ఆలా అనుచున్నా రేమిటి! మీ రేమి చేసితిరి?" అని అత్యాతురతతో నాయుడుగా రనిరి.

రామలింగముపిళ్ల తత్తఱపడుచు "అయ్యో! అయ్యో! ఎంతపని చేసితినండీ! అనవసరముగా మీకు లేనిపోని తొందరను కలుగజేసితినిగదా! అయితే వాడిమాటలు నే నేవిధముగ నమ్మకుందునండీ!" అనెను.

"సంగతిసందర్భము లేమిటో తెలియజెప్పుము. నీకు ఎవరు చెప్పినారు? నీ వేమి చేసితివి?"

" నేడుదయము కలెక్టరుగారు నాకు కబురంపిరి. నేను తత్క్షణమే వెళ్ళి వారిదర్శనము చేసికొంటిని. దొరగారు నన్ను చూచి "రామలింగముగారూ! కాశ్నుకేసుసందర్భమున మనకు కావలసిన సాక్ష్యమంతయు సంపాదించితిరా" అని ప్రశ్నించిరి. "మహాప్రభో! చిత్తము. నేరము జరుగునపుడు పోలీసుజంట్రాతు లిద్దఱు అచ్చటనుండిరి. వారు నేరస్థులను గుర్తింపగలరు" అని జవాబిచ్చితిని. అంత వారు మండిపడి "నాన్సెన్సు. ఈ అయిదాఱురోజులపట్టి మీరు వెలగబెట్టిన కార్యమింతేనా! పోలీసువారేనా మనకు సాక్షులు? ఇంత పెద్దపట్టణములో నీ కింకెవరును దొరక లేదు కాబోలును" అని పలికిరి. మీరు నమ్ముతారో, లేదోనండి. ఆమాటలు వినునప్పటికి నాప్రాణములు నిలువున పోయినవి. ఏమి చెప్పితినో నాకే జ్ఞాపకము లేదు. ఎట్లో వారిని సంతోషపఱచుటకు "ధర్మావతారా! మఱచిపోతిని. క్షమింపుడు. డాక్టరు కృష్ణారావు నాయుడుగారు మనసాక్షులలో నొకరు. ఆ కాలమున వారు స్టేషనులోనే యున్నారని తాలూకాగుమాస్తా యొకరు చెప్పినారు. వారు తప్పక నేరగాండ్రను గుర్తింపగలరని తలంచెదను" అని పలికితిననుకొందును. ఆమాటలను విని వారు సంతోషించి "మంచిది. వెళ్లుము. నీపని చూచుకొనుము" అని పలికిరి.

డాక్టరుగారీ మాటలకు కోపపడి "సంగతిసందర్భములు తెలియక నీ విట్లుచేయుట న్యాయమా" అని గద్దించిరి.

"అయ్యా! తాము కోపప[illegible]భము లేదు. [illegible] కేమి తెలియును? మీరప్పుడు స్టేషనుదగ్గ[illegible]యున్నారు. దొరగారిగాయములను పరీక్షించితిరి. కట్టు కట్టితిరి. ఇట్టిపరిస్థితులలో తమకేమియు తెలియదని చెప్పిన నమ్మువా రెవరు?"

"మంచిది. తప్పేమిటో చేసితివి. తత్క్షణమె కలెక్టరు గారియొద్దకు వెళ్లి జరిగినసంగతులను నివేదింపుము."

"డాక్టరుగారూ! మీరావిధముగ భ్రమపడవద్దు. నేనొక రోజొకసంగతి మరునాడింకొకటి చెప్పువాడనుగాను."

డాక్టరుగా రందులకు నవ్వి "మంచిది. ఈకార్యము నీవలన సాధ్యముకాకపోయిన నేనె కలెక్టరుగారియొద్దకు వెళ్లి సత్యాసత్యములను దెలుపుకొందును" అని పలికెను.

"మీ యిష్టము వచ్చినటులు చేయుడు. కాని పర్యవసానమే మగునో తెలియునా?"

"ఏమగును ?"

"అది అధికారరహస్యము. మనమిరువురము ఒక్క ప్రభుత్వముక్రిందనే సేవచేయుచున్నాము. ఈస్థలముననే మూడేండ్లబట్టి పని చేయుచున్నాము. బ్రాహ్మణేతరవంశ సంజాతులము. కావున మీ కారహస్యమును వెలిబుచ్చిన నేమియు పరవాలేదు. వినుడు" అని ఇన్స్పెక్టరు పిళ్లగారు "బహిరంగముగ కాకపోయినను, మీరు జాతీయోద్యమముపట్ల

చాల సానుభూతి గలదు. ఈ విషయమున ప్రభుత్వము వారికి మీమీద రిపోర్టు పోయియున్నది. మీచర్యలను కను గొనుటకు వారు ప్రత్యేకముగా గూఢచారులను నియమించి యున్నారు. కలెక్టరుగారికి మీవిషయము ఎప్పటికప్పుడు దెలి యుచునేయున్నది. ఇప్పుడాయనను దర్శించి నిజము జెప్పుకొని నను మీమాటలను నమ్ముదురనుకొందురా? అగ్గిలో ఆజ్యము పోసినటులు, మీపై నింకను ఆగ్రహించుకొందురు. ఉన్న సంగతులు చెప్పినందులకు క్షమింపుడు" అని పలికిరి.

డాక్టరుగారికీమాటలను వినినంతనే మొగము మండి పోయినది. "జాతీయోద్యమముపట్ల సానుభూతిని దెలుపుట మహాపాతకమని తలంచుచున్నారా? అదంతా పోనీయండి. దానికిని ఈ దొరగారి కేసునకును ఏలాటిసంబంధ మున్న దండీ" అని అడిగెను.

"డాక్టరుగారూ! మీరటుల తొందరపడిన లాభము లేదండి. జాతీయోద్యమమునకును, ఈకేసునకును ఏలాటి సంబంధము లేనిమాట నిజమే. ఉద్యమముపట్ల మీకు అభి మానముండగూడదని నేను చెప్పుటలేదు. అయినను ప్రభుత్వ మువారటులు తలంతురా? వారి దృక్పథము వేఱు. మనది వేఱు."

"ఇన్స్పెక్టరు గారూ! మీరు చెప్పినదంతయు నిజమే. కాని ఈకేసునుండి నేనేవిధముగ దప్పించుకొనగలనో చెప్పండీ!" అని అడిగెను.

డాక్టరుగారు తనమాయలలో చిక్కినాడని ఇన్స్పెక్టరు పిళ్లెగారు తనలో తానానందించుకొనుచు "డాక్టరుగారూ! దానిని మీరే ఆలోచించుకొనవలయును. ఒక్క నిమిషము మేజస్ట్రేటుగారి కార్యాలయమునకు వచ్చిన చాలును. నా వెంట పోలీసు ఠాణాకు వత్తురా? అచ్చట బంధింపబడిన నేరస్థుల నొకసారి చూచి పోవచ్చును. ముందుగా నొకసారి వారిని చూచినగాని కోర్టులో వారిని గుర్తించుట కష్టతరము. ఇతరులెందఱో కేసులో మనపక్షమున సాక్ష్యమీయబోవుచున్నారు. దానిని మీకు వినిపింపగలను? ముందే తంతంతయు తయారుచేసికొనిన మంచిదిగదా! తరువాత ఈ కేసులో ఎట్టిసంబంధమును మీకు ఉండకుండ చేయుభారము నాది" అనెను.

ఈ మాటలను వినినప్పుడు డాక్టరుగారి పరిస్థితి యెటులున్నదో, ఇచట వ్రాయుట అనవసరము.

"ఏమిటి! నిర్దోషులగు నా దేశీయులకు వ్యతిరిక్తముగా తప్పుడుసాక్ష్య మీయ ప్రోత్సాహ మొసంగెదవా? నీవంటి అధికారులవలననే, అధికారవర్గమున కపకీర్తి వచ్చుచున్నది. నీవంటినీచులు నాయింటిలో నుండనక్కఱలేదు. వెళ్లుము. ఎవడురా! అక్కడ. ఈ దుర్మార్గుని ఇంటిలోనుండి వెడల దఱుముము" అని అఱచెను.

ఇన్స్పెక్టరుగారు లేచి వెళ్లుచు "మాట నెమ్మదిగా రానిమ్ము! నీకు తగినశాస్తి చేయకపోయిన నాపేరు రామలింగముపిళ్లయా?" అనెను.

డాక్టరుగారు "నీవు పెట్టగల కష్టములన్నియు జూడగలను. నీవంటి నీచులవలన భారతసంతానమున కంతయు నపకర్తి వచ్చుచున్నది. నీవు మా యింటిలో నుండదగినవాడవు కాదు" అని ఇంటిలోనుండి ఇన్స్పెక్టరుగారిని వెడలదఱిమెను.

## నాలుగవ ప్రకరణము

ఇన్స్పెక్టరు రామలింగముగారు డాక్టరుగారి యింటి నుండి తిన్నగా పోలీసుఠాణాకు వచ్చి. అచ్చట నున్న యొక బంట్రౌతును బిలిచి "జమేదారూ! డాక్టరుగారి కుమాళ్ల పేర్లు తెలియునా?" అని అడిగెను.

"ఏ డాక్టరుగారి కుఱ్ఱవాండ్రండీ?"

"నాయుడుగారి కుఱ్ఱవాండ్లు. అంతకన్న మహానీయు లెవ రున్నారు? దొరతనమువారి ఉప్పును దినుచు రాజద్రోహులైన ఆ డాక్టరుగారి కుమాళ్లు నీకు తెలియునా?"

"ఆ. ఆ పిల్లవాండ్రను అప్పుడపుడు చూచుచున్నా నండీ. వారి పేళ్లుమాత్రము తెలియవండీ"

"మంచిది. నీవు వెంటనే వెళ్లి ఆ కుఱ్ఱవాండ్ల పేళ్లను కనుగొని రమ్ము" అని యాతని కాజ్ఞాపించెను.

చిత్తమని జమేదారు డాక్టరుగారి యింటివైపు వెళ్లెను.

రామలింగముగారు కోపముతో మండిపడుచు ఠాణాలోని వసారాలో నిటునటు పచారు చేయుచు తనలో నేదేదియో గొణుగుకొనుచుండెను. అత డేమనుకొనుచున్నది శ్రద్ధతో వింతము.

"ఏమి? కాల మేలాగున మారిపోవుచున్నది! నన్ను వాడు తిట్టువాడా! వెడలదఱుముటకు సేవకుని బిలుచునా? తా నొక గొప్ప మహారాజు ననుకొనుచున్నాడు. అబ్బాయి! మంచిది. ఇక సిమేమ కాలములో అబ్బాయికి ప్రాయశ్చిత్తము చేయించెదను చూడుము. కుమాళ్ల నిద్దఱిని ఇప్పుడే చెఱశాలలో బెట్టించెదను. ఆంతటితో నూరకుందునా! వానిని నా కాళ్ల క్రింద పడద్రోసి త్రొక్కివైచెదను ఏమి చేసిన మంచిది! ఆ. తెలిసినది. క్రిమినలు చార్జి యొకటి వానిమీాద దేవలయును. ఎట్టికేసును దెచ్చిన మంచిది? రాజకీయ నేరస్థులు వెచ్చుచుండు దొంగసొత్తును తక్కువధరలకు కొనుచున్నాడని నేర మారోపింపవలయును. ఈ విషయమున సాక్ష్యమును సంపాదించుట అంత గొప్పలోనిది కాదు. అతని యింటిని పరిశోధించిన మనకు కావలసిన దొంగసొత్తంతయు దొరకగలదు. ఈ కార్యమును సాధించుట కష్టతర మని తెలి

యును. అయినను ఫరవా లేదు. డిప్యూటీమేజస్ట్రేటుగా
రీ కేసును నమ్మెదరా? నమ్మకపోతే వానిగతియేమగునో తెలి
యదా? వారికి మనలనుచూచిన ఎంతయో భయము. అథవా
డాక్టరుపట్ల గల అభిమానముచే కేసును కొట్టివేయు నను
కొందము. అదియు చూచెదము. నే నీవిషయము సూపరిం
టెండెంటుగారితో మనవిచేసికొనిన అబ్బాయిగతి యేమగునో
తెలియునా? రాజకీయనేరములలో ఈమేజస్ట్రేటు ముద్దాయిల
వైపు పక్షపాతము జూపుచున్నాడని సూపరింటెండెంటుదొర
గారు ప్రభుత్వమువారికి వ్రాయును. అబ్బాయిని ఉద్యోగము
నుండి యూడబెరికితి మనియో లేక ప్రమోషనను నిలిపి
మఱొకస్థలమునకు బదలాయించితిమనియో మఱునాటిగెజెట్టు
లోనే ప్రభుత్వముఖ్యకార్యదర్శిగారు ప్రకటించెదరు. ఈ
సంగతులన్నియు తెలిసియే డిప్యూటీమేజస్ట్రేట్లు మనల నాశ్ర
యించియుందురు. ఇదియే అధికారరహస్యము. పోనియండి.
మనకోరికప్రకారమే, డాక్టరు దోషి యని తీర్మానించి సెష
న్సుకు బంపును. అప్పుడు పెద్దగండమున్నది దాటవలెను. జిల్లా
జడ్జిగారు కేసును విచారించి "డాక్టరుగారు గొప్పయుద్యోగి.
సుప్రసిద్ధవంశమునకు సంబంధించినవారు. అట్టివారు దొంగ
సొత్తును కొనెదరని నే నెన్నటికిని నమ్మజాలను. కేసంతయు
పోలీసువారు కల్పించినదే" అని మనల చెడబడ దిట్టి కేసును
కొట్టివేయవచ్చును. ఈ జడ్జీలను నమ్మరాదు మనపాలిటి
తలకంటకము. వీరిమీద మన ఆటలు సాగవు. కావున ఏమి

చేయవలయును? ఆజ్ఞ తెలిసినది. ఈవిధముగ చేసిన బాగుగ నుండును. నిన్న చీమకుర్తి అల్లరులలో దెబ్బలు తగిలినవారిని కొందఱిని చికిత్సార్థమై ఈడాక్టరునొద్దకు బంపియుంటినిగదా! గాయములు అల్లరులలో తగిలినవి కావని యీతడు వ్రాసియున్నాడు. నే డామనుష్యులలో కొందరిని బట్టుకొని, తమకు అల్లరులలో బలమైనగాయములు తగిలినను డాక్టరు, తనువిరోధస్థులనుండి లంచము పుచ్చుకొని అన్యాయము చేసినాడని అర్జీ నిప్పించెదను. లంచము కేసులోనుండి తప్పించుకొనలేక ఆతడు అల్లాడవలసియుండును. అథవా, డాక్టరుగారిని చూచి వారు భయపడి నామాట వినకయున్న వారిని హైగలో పెట్టి 110-వ సెక్షను క్రింద కఠినశిక్షను వేయింపలేనా? ఇవంతయు వారికి తెలియును. నేను చెప్పినట్టులు చేయగలరు. డాక్టరునకు తగినశాస్తి చేయింపగలను."

అని పిళ్లెగారు తనలో తా నేమియో యనుకొనుచుండ ఇంతలో జమేదారు వచ్చి, ఆయనకు కావలసిన సంజాయిషీ నిచ్చెను. వెంటనే పిళ్లెగారు తమ కార్యాలయములోనికి వెళ్లి గూరుచుండి, డాక్టరుగారి యింటిని సోదాచేయుటకు ఉత్తరు విప్పింపగోరుచు కలెక్టరుగారిపేర నొక అర్జీని బంపుకొనెను. దానిప్రతి నిందు ప్రచురించుచున్నాము.

" సార్వభౌముడు చిరకాలము వర్ధిల్లుగాత :

హుజూరువారు నాకాజ్ఞాపించిన ప్రకారము కొన్ని దొరగారి కేసులో పనిచేయుచుండగా ఇరువురు బాలకు లీనేరమున పాలుగొనినారని ఇప్పుడే నాకు తెలియవచ్చినది. వీరు మనయూరిలోని డాక్టరు కృష్ణారావునాయుడుగారి పుత్రులు. సూర్యప్రకాశము, సూర్యప్రసాదము అనువారలు. సూర్యప్రకాశము బందరులోని జాతీయకలాశాలలో పట్టపరీక్షకు చదువుచున్నాడట. అతని ప్రోద్బలముచేతనే తక్కిన ముద్దాయీలు చెలరేగి దొరవారిని కొట్టినారని తెలియవచ్చుచున్నది. క్రిమినలు ప్రొసీజరుకోడు 54-వ సెక్షనుక్రింద ఇద్దఱిని అరెస్టు చేయుటకు ప్రయత్నము చేయుచున్నాను.

ఇంకను ఈవిషయమున విచారణ సలుపగా, ఈమధ్య బందరులో జరిగిన అల్లరులలో సైతము ప్రకాశమునకు చాల వఱకు సంబంధ మున్నదని తెలియుచున్నది. అతడిచ్చట స్వదేశీసమితి అనుపేర నొక సంఘమును స్థాపించి కుఱ్ఱవాండ్రు లాఠీల నేవిధముగ నుపయోగింపవలయునో చూపుచున్నాడట. ఈ సంఘమునకు పురవాసు లనేకులు చందాల నిచ్చుచు పోషించుచున్నారట. ప్రకాశముతమ్ముడు సూర్యప్రసాదము ఈ విషయమున అన్నకు మించినవాడట. ఇతడు సైత మొక సంఘము నేర్పఱచి యూరోపియను స్త్రీపురుషాదులమీద రాళ్ల నేవిధముగ రువ్వవలయునో, వారి రాకపోకల నడ్డగించుటకు ఏయేపనులు చేయవలయునో, సంఘసభ్యు లగు కుఱ్ఱవాండ్రకు బోధించుచున్నవాడట.

ఇదియుగాక, దొరగారిని కొట్టుటకు ఉపయోగింపబడిన దుడ్డుకఱ్ఱ యొకటి డాక్టరుగారి గృహమున దాచబడియున్న దని తెలియుచున్నది. ఆయనకుమార్లు స్థాపించిన సంఘములకు సంబంధించిన పుస్తకములు మొదలగునవి అనేకములు వారియింటనే యున్నవట. వానిని పరీక్షించిన, దొరగారి కేసునకు సంబంధించిన విషయము లనేకములు తెలియగలవు. కావున ప్రభువులవారు అనుగ్రహించి క్రిమినలు ప్రొసీజరు కోడు 96 వ సెక్షను క్రింద డాక్టరుగారియింటిని పరిశోధించుటకు వారంటును దయచేయ ప్రార్థించుచున్నాను.

డాక్టరుగారు ప్రభుత్వోద్యోగులైనను రాజకీయవిషయములలో పాల్గొనుచున్నారని, ప్రభువులవారికి మనవి చేయవలసి వచ్చినందులకు క్షమింపుడు. స్వదేశోద్యమముపట్ల వారికి గల సానుభూతి ఇంతంతని వర్ణింప నలవి కాదు. వారియింటిలో స్వదేశవస్తువులు తప్ప మఱేదియు ముట్టరట. ఈ పురమున నెలకొల్పబడిన స్వదేశ పారిశ్రామికయంత్రాగారమున డాక్టరుగా రొకభాగస్థులట. ఇతరు లనుమానించెద రని ఈ కర్మాగారమునకు సంబంధించిన వాటాలను తన భార్యపేరిటతో కొనియున్నారట. ఆయనకుమారులు మన కేసులో ముద్దాయిలైనందున డాక్టరుగారి సాక్ష్యమువలన మన కేమాత్రము లాభదాయకము గాదని నాయభిప్రాయము. కావున ప్రభువులవారు ఆయనపేరును మన సాక్షులజాబితాలోనుండి కొట్టివేయ విన్నవించుకొనుచున్నాను.

ఈడాక్టరుగారు పురములోని పెద్దమనుష్యులతో ప్రభువులవారిని ఇతర ఉద్యోగస్థుల నెవరినిగాని లక్ష్యముచేయ వని చెప్పుచున్నాడట.

భవద్విధేయసేవకుడు,

రామలింగము పిళ్లె."

ఆనాడు సాయంకాలములోపుగనే డాక్టరుగారి పుత్రులిద్దఱు అరెస్టుచేయబడి కారాగారమున నుంచబడిరి. పోలీసువారి యీ దురంతమును వినిన పెద్దమనుష్యులలో కొందఱు ఇన్స్పెక్టరును ఆనాడే దర్శించి. ఆ కుఱ్ఱవాం డ్రిద్దరిని జామీనుమీద విడుదలచేయగోరిరి. పిళ్లగారు "మీ రిందులో జోక్యముపుచ్చుకొనుట మంచిది గాదు. రాజకీయనేరస్థులను జామీనుమీద విడుదల చేయగూడ దని కలెక్టరుగారు ఉత్తరువుల పాలించియున్నారు." అని ప్రత్యుత్తర మిచ్చి వారిని సాగనంపెను.



అయిదవ ప్రకరణము

రామలింగముగారు ఠాణాలోనే కూరుచుండి, సుబ్బిసెట్టిగారి ఆవుల నపహరించుకొనిపోయినాడని ఖైదీచేయబడిన నొకనితో నేదియో మాటలాడుచుండెను నేరస్థుడు చేతులను కట్టుకొని "బాబయ్యా! నిన్నటిదినము నా నాగలిఎద్దులను

అమ్మించగా వందరూపాయలు వచ్చె[illegible] ఆ మొత్తమును పుచ్చుకొని నష్టకష్టములనుండి తప్పించ[illegible]చుండెను. రెండువందల రూపాయిల కొరకు చిల్లిగవ్వ తక్కువైనను పుచ్చుకొనననియు సదరు లెక్కను మఱునటిదిన ముదయములోపుగ తన కర్పింపకపోయిన, మేజస్ట్రీటుగారితో చెప్పి విచారణను ప్రారంభింతు ననియు, రామలింగముగారు పట్టు పట్టెను. ఇంతలో పోలీసుబంట్రౌతొకడు కలెక్టరుగారియొద్ద నుండి యుత్తర మేదియో దీసికొనివచ్చి యాతనిచేతి కిచ్చెను. అందు కలెక్టరుగారు రామలింగముగారు వ్రాసిన విషయముల నామోదించుచు, డాక్టరు నాయుడుగారి గృహమును వెంటనే సోదా చేయవలయునని యుత్తరు వీయబడియుండెను. దానిని చదివినవెంటనే రామలింగముగారికి గలిగిన ఆనందమును వర్ణింపదరమా! ఆ సంతోషసమయమున తన పట్టంతయు వదలి నేరస్థుడు సమర్పింపదలంచుకొనిన వందరూపాయలను పుచ్చుకొని డిప్యూటీమేజస్ట్రీటుగారి కీవిధముగా రిపోర్టు వ్రాసెను.

"రాముని కేసువిషయమున కావలసిన సాక్ష్యమును సమకూర్చుచుండగా అతడు నిర్దోషి యని తెలియవచ్చినది. సుబ్బిసెట్టిగారి ఆవులు పలుగును త్రెంచుకొని ముద్దాయి దొడ్డిలో జొరబడి గడ్డిమేయుచుండెనట. వానిని బందిలిదొడ్డికి బంపు నుద్దేశ్యముతో ముద్దాయి తన యింటిలో కట్టివేసికొనెను. ముద్దాయిమీద మా జవానులు పొరపాటున ఈనేర మారో

పించినందులకు విచారకరముగా నున్నది. కేసును తమ ఫైలు లోనుండి కొట్టివేయ గోరుచున్నాను."

తదనంతరము మనమిత్రుడు తన దుస్తులను ధరించి ఇరువదిమంది పోలీసుసిబ్బందిని వెంటగొని డాక్టరుగారి యింటి వైపునకు మరలెను. మార్గమధ్యమున నగపడిన ఇద్దరు పెద్ద మనుష్యులను సోదా సమయమున పంచాయతీదారులుగ నుండుట కాహ్వానించి సత్వరముగ డాక్టరుగారి యింటికి వచ్చెను. అంత పోలీసుసిబ్బంది తమగృహమున ప్రవేశించు టకు కారణ మరయజాలక ఆశ్చర్యమగ్నులై యున్న డాక్టరు గారికి పిళ్లగారు కలెక్టరు ఉత్తరువులను జూపి, సోదా సమయ మున తనకార్యమున కేలాటి ఆటంక ముండకుండుటకుగాను ఇంటిలోని ఆబాలగోపాలమును ప్రక్కయింటిలోనికి బంపి వైచెను.

పిమ్మట గృహమును సోదా చేయుటకు ప్రారంభించెను. ఇంటిలోనున్న వస్తువులనన్నిటిని వెలుపలికి దెప్పించెను. పెట్టెల తాళములు తీసివేయబడెను. వానిలోని సామానునంతయు క్రింద పాఱవేయబడెను. శాలువాలు, చీరలు, చొక్కాయలు, దోవతులు, అవి యివి యననేల వారియింటిలోనున్న వస్తువు లన్నియు గాలి కెగిరిపోవుచుండెను. డాక్టరుగారికోడలు తన భర్తకు వ్రాసిన యుత్తరములకట్ట యొకటి పెట్టెలో కనబ డెను. దానిని చూచినంతనే పిళ్లగారి సంతోషము వర్ణింప

నలవికాదు. "ఇంక అరాజక సంఘములవారి రహస్యము లనే
కములు దొరకగలవ"ని చంకలు గొట్టుకొనసాగెను. దానిని
తన అంగీలో దాచెను. సూర్యప్రకాశము పెట్టెను తెఱవగా
మాళ్లపత్తెయను గ్రంథము కనబడెను. దానిని సైతము భద్ర
పఱచెను. సామానునంతయు పరీక్షించిన యనంతరము ఇంటి
లో ప్రవేశించెను. తన కగపడిన బీరువాలను పగులగొట్ట
సాగెను. అద్దపుకిటికీలు, అలమారాలు ఎన్నియో బద్దలగు
చుండెను. ఇంతటితో ఈ మహానీయుడు ఊరకుండినవాడు కాదు.
డాక్టరుగారి మంచములక్రిందిలో ప్రవేశించి అంకలిబుడ్ల నతిజాగ్ర
త్తతో పరీక్షింపసాగెను. ఇంటి జమాఖర్చుల పుస్తకములను
పరీక్షించెను. ఒకబీరువా తెఱవగా బొమ్మలపుస్తకము లనేక
ములు కనబడెను వానిని సైతము అతిజాగరూకతతో పరీ
క్షించుచుండెను, తిలకుమహారాజు, గాంధిమహాత్ముడు మొదలగు
నాయకుల ఛాయాపటము లాయనకంట్ల యెదుట బడెను.
వానిని దాచియుంచుమని సేవకుని కిచ్చెను. మరొకచో వార్తాప
త్రికల సంపుటము లగపడెను. వానిని అతిజాగరూకతతో పరీ
క్షించి, వానిలోని కొన్నివ్యాసములను కత్తిరించి తనయొద్ద
నుంచుకొనెను. ఇంకొక బీరువాను తెఱవగా అందు "విష
ద్రావకములు" అని పెద్దయక్షరములు గల యొక పలకను
చూచెను. ఆ ద్రావకములలో బాంబులను చేయుటకు వాడ
బడు వస్తువు లేమైన గలవో చూడసాగెను. వానిని పరీక్షిం

చుచుండగా అపూర్వమగు మందొకటి ఆయనకంటబడెను. దానిమీద ఫ్రెంచిభాషలో నేదియో వ్రాయబడియుండెను. ఎంత ప్రయత్నించినను అందుగల వస్తువు ఫలానిదని గ్రహించ జాలకపోయెను. దానిమూత తెరచి, యాఘ్రాణించి, తనతో నున్న పంచాయతీదారులను బిలిచి "ఈ సీసాను చూచితిరా? ఎంతపని జరిగినదండీ! డాక్టరుగా రింతరాజద్రోహు లని కల లోనైన దలచియుండ లేదు. నాయుడూ! ఎంతపనిచేసితివిరా?" అనుచు మరొకసారి ఆమందును పరీక్షించి "అయ్యా! దీని వాసన నొకసారి చూడండి" అని పంచాయతీదారుని చేతి కీయబోయెను.

"క్షమింపవలెను. చిన్నటినుండి ఆ పాడువడిసెను నన్ను వేధించుచున్నది. తాము చూచిన మేమందఱము చూచి నటులనే" అని పంచాయతీదారుడు పలికెను.

"అయ్యా! ఇందులో ఏమియు హాని లేదు" అని పిళ్ల గారు మఱొకసారి దానిని తెఱచి వాసనచూచెను. రెండు మూడు బొట్లను తన నాలుకమీద వేసికొనెను. నోరంతయు వెగటుగనుండెను. దాని పేరేదియో చెప్పుమని పంచాయతీ దారులలో నొకరిచేతి కిచ్చెను. ఆయనగారు దానిమూతపై గల అక్షరములను చదివి ఫ్రాన్సుదేశమున తయారైన యొక విధమగు సారాయ మని చెప్పెను.

తదనంతరము రామలింగముగారు డాక్టరుగారి పడక గదిలోనికి వెళ్లి అచ్చటగల తలగడలను, పఱుపులు మొదలగు వానిని పరీక్షింప నారంభించెను. తనవెంటనున్న పంచాయతీ దారులతో "అనేకపర్యాయములు నా కీగదులలోనే రాజద్రోహసంబంధము లగు వస్తువులు అగపడుచుండెడివి" అనెను. వానిని ఎంత పరీక్షించినను, ఆయనకు కావలసిన వేమియు కనుబడలేదు. తరువాత రెండుమూడుగదులను చూచి, వెలుపలికి వచ్చెను. తానింతవఱకు సంగ్రహించిన వస్తువులను పంచాయితీదారులకు చూపెట్టుచు వాని జాబితాను వ్రాసికొనెను. తదనంతరము మాతని కేదియో జ్ఞాపకమునకువచ్చినందున సేవకు నొకనిని బిలిచి "మఱచితిని. లోనికి వెళ్లి లాటీ లేనైన అగపడిన తత్క్షణమే తీసికొని రమ్మ"ని యాజ్ఞాపించెను.

పోలీసువారి అదృష్టముననో, మరి దేనివలననో, కర్నూలుమండలమునకు సంబంధించిన యొకరు డాక్టరుగారి యింటిలో నౌకరిగిరి చేయుచుండెను అతనియొద్ద దుడ్డుకఱ్ఱ యొకటి గలదు. పోలీసుజవాను లాకఱ్ఱను దెచ్చి తమ అధికారి చేతి కిచ్చిరి. దాని నాయన శ్రద్ధతో పరీక్షించినను, తన కార్యమునకు కావలసిన కాపీ యేమియు కనబడలేదు. దానిని సైతము 'నెత్తురుమరకలు గలలాఠీ యొకటి" యని జాబితాలో చేర్చెను. దైవచిత్ర మేమియోగాని, మఱునాడు డాక్టరును, న్యాయస్థానమున నుంచగ, దాని నిండుగ నెత్తురు

మరక లుండెననిమాత్ర మిచట నుదాహరించిన చాలును. జాబితాయందు పంచాయతీదారుల సంతకముల గైకొని, తాను సంగ్రహించిన వస్తువులను జవానులపరము చేసి, పోలీసు మిత్రుడు రామలింగముపిళ్లగారు గృహాభిముఖు డయ్యెను.

## ఆరవ ప్రకరణము

పోలీసుసిబ్బంది ఇంటిలోనుండి వెడలిపోయినవెంటనే, డాక్టరుగారు పరిశోధనకాలమున గనుపించుచున్న పంచాయతీదారులను కలిసికొని "అయ్యా! ఆ రామలింగము మా యింటిలో చేసినపనులన్నియు తాము కన్నులార గాంచితిరి గదా!" అనెను.

"అవును. మీకు జరిగిన ఈ పరాభవమునకు మా కెంతయో విచారకరముగ నున్నది" అని పంచాయతీదారులలో నొకరనిరి.

"నే నిపుడు కలెక్టరుగారిగృహమునకు వెళ్లుచున్నాను. తాము నా వెంట రాగలరా?" అని వారి నడిగెను.

"మే మెందుకులకండీ" అని మరొక పంచాయితీదారు డడిగెను.

"నేను దొరవారితో రామలింగము చేసిన దురంతము నంతయు మనవిచేసికొందును. కలెక్టరుగారు దయార్ద్రహృద

యులు. వారు నాకు తప్పక న్యాయము దయచేయగలరు”
అని డాక్టరుగారు పలికిరి.

ఈ మాటలను వినినపిమ్మట మన పంచాయతీదారు
లేమియు మాటలాడలేదు. డాక్టరుగారే మరల “ఏమనెదరు?
నా వెంట వచ్చెదరా. లేదా చెప్పుడు.” అని వారల నడిగెను.

అంత వారిలోనొకడు “డాక్టరుగారూ! మీరే స్వయ
ముగా వెళ్లి కలెక్టరుదొరవారితో మనవిచేసికొనిన శ్రేయో
దాయకముగ నుండును. వారు చాల మంచి వారని మీరే
చెప్పుచున్నారుగదా! ఇక మే మెందులకు? అదియుగాక, ఇది
చాల అపాయకరమైన విషయము. అన్యులీవిషయమున జోక
బడుట అంతబాగుగా లేదు” అనెను.

ఇంకొకడు “డాక్టరుగారూ! నేనొకసంగతి చెప్పెదను.
కలెక్టరుదొరగారు ఎంత మంచివారైనను, ఈవిషయమున
మాత్రము, వారు మీ కేమియు సహాయము చేయబోరు.
అదియుగాక, పోలీసువారి దయాదాక్షిణ్యములవలన బ్రతుకు
వారము మేము. అట్టిచో వారికే వ్యతిరేకముగా ప్రవర్తించిన
మాగతి యేమగునో తెలియునా?” అని పలికెను. ఈమాట
లకు డాక్టరుగారికి పట్టరానికోపము వచ్చి “మీ యిష్టప్రకా
రమే ప్రవర్తించండి” అనెను. వారు “చిత్త” మని తమ యిండ్ల
దోవ బట్టిరి.

పిమ్మట డాక్టరుగారు కలెక్టరుగారిగృహమున కరిగెను. దొరగారు క్రీడార్థమై క్లబ్బునకు పోబోవుచుండెను. డాక్టరుగారాయనకు సలాముచేసి నిలువబడెను.

"ఓహో! మీరా! ఎందులకు వచ్చితిరి?" అని కలెక్టరుగారు ప్రశ్నించిరి.

"ప్రభూ! నాకొక గొప్ప ఆపద సంభవించినది. మీ సహాయము నపేక్షించి ఇచ్చట కరుదెంచితిని" అని యింకను నేమేమో చెప్పబోవుచుండ, దొరగారు రడ్డమువచ్చి

"మీరు చెప్పదలంచిన విషయము నాకు తెలియును. కాక్సుహారగారి కేసుసందర్భమున మీ కుమారులు అరెస్టు చేయబడిరి గదా?" అని ప్రశ్నించెను.

"చిత్తము. నాపై గల పగమీద ఇన్స్పెక్టరు నా కుమారులను అరెస్టుచేసినాడు. మరల తప్పక......" అని డాక్టరుగారేమియో చెప్పబోవుచుండ, కలెక్టరుగారు మండిపడి "ఏమి పలుకుచున్నావు? ఏ పిల్లవాండ్ర కేసును రేపు విచారణచేయుదు రని తెలిసియు ఎంతధైర్యముతో నాయొద్దకు వచ్చితివి?" అని మాఱుమాటాడక తనకై వెలుపల వేచియున్న బండిపై నెక్కి క్లబ్బునకు వెళ్లెను.

డాక్టరుగారేమి చేయుటకు తోచక తన యింటిదారి పట్టెను.

## ఏడవ ప్రకరణము

రాత్రి ఎనిమిదిగంటలకుపైగా నైనది. డాక్టరుగారి యింటిలో వంట ప్రయత్నము లేవియు ఇంతవరకు జరుగలేదు. అందఱు విచారమగ్నులై యుండిరి. డాక్టరుగారి స్థితిని చెప్పనక్కఱలేదు. శిరోవేదనచే బాధపడుచు మంచముమీద పరుండియుండిరి. ఆయన కుమార్తెలలో నొకతె ఆయన చెంత గూర్చుండి యుపచారము చేయుచుండెను. కోడలు విసనకఱ్ఱను గైకొని మామగారికి విసరుచు ఆయనయొద్ద నిలువబడియుండెను.

సేవకుడొకడు వారున్నస్థలమునకువచ్చి "బాబయ్యా! ఎవరో మీకొఱకు వచ్చి వెలుపల వేచియున్నారు. వారి రాకకు కారణ మడిగితిని. వారి యింటిలో నెవరికో జబ్బుగ నున్నదట. మిమ్ములను చూడవలయు నని వారు కోరుచున్నారు" అని చెప్పెను. "నా దేహము సుస్తీగా నున్నది. ఇం కేడాక్టరు నైన చూడుమని చెప్పుము" అని డాక్టరుగా రనిరి. సేవకుడు వెళ్లిపోయెను.

పదిగంటలకుపైగా నైనది. మరల నెవరో డాక్టరుగారి యింటియొద్దకువచ్చి డాక్టరుగారిని పిలువసాగిరి. సేవకుడు మరల డాక్టరుగారియొద్దకు వచ్చి "బాబయ్యా! మరల వారే వచ్చి

నారు. తమదర్శనము చేయనిది వెళ్లనని ఆతడు పట్టుపట్టి యున్నాడు" అనెను.

"మంచిది. వారిని లోనికి రమ్మనుము" అని డాక్టరుగా రనిరి.

స్త్రీలందఱు లోనికి వెళ్లిరి. వచ్చిన ప్రేమకుడు డాక్టరు గారికి నమస్కరించి "డాక్టరుగారూ! మేము చాలా ఆపదలో నున్నాము. మామీద కటాక్షముంచి రక్షించుభారము మీా మీాద గలదు" అని వేడుకొనెను.

"సంగతి యేమియో చెప్పుము." అని అతని నడిగెను. ప్రేమకుడేమియు ప్రత్యుత్తర మీాయలేదు.

డాక్టరుగారు మరల "మీాలో నెవరికి జబ్బు? తక్షణమే చెప్పుము" అని ప్రశ్నించెను. ప్రేమకుడు "అయ్యా! ఏమి చెప్పుటకును తోచకున్నది" అని ఏడువసాగెను.

డాక్టరుగారు "నీ వెవరవు?" అని ప్రశ్నించెను.

"అయ్యా! నే నొక పోలీసు అధికారిని. నాపేరు గోవిందరాజులు. మాయజమానుడు చాల ఆపదలో నున్నాడు. నేడు మీాయింట జరిగినవిషయముల కాయన ఎంతయో చింతించుచున్నారు. ఆకార్యమునకు గాను మిమ్ము క్షమింప ప్రార్థించుచున్నారు" అని నుడివెను.

"సరే. అసంగతుల కేమిలే? ఇప్పు డాయనకు వచ్చిన జబ్బేమి?"

"గుండెలో చాల నొప్పిగ నున్నది. ఊరక వాంతుల జేసికొనుచున్నారు. మీరు వచ్చి చూడ వేడుచున్నారు."

"నేనిప్పుడు రాజాలను. ఈపురములో వైద్యు లెందఱో గలరు. వారిలో ఎవరియొద్ద కైనను వెళ్లుమను."

ఈమాటను వినినంతనే గోవిందరాజులుగారు తన అంగీలోనుండి వందరూపాయలనోటును తీసి "అయ్యా, మా మీద కరుణయుంచి రక్షింపుడు" అని దానిని డాక్టరుగారి కియబోయెను.

డబ్బును చూచినంతనే, డాక్టరుగా రనుమానించి "ఓ. తెలిసినవి మీతంత్రములు! డబ్బుమూలకముగనైన నాకు ఆశ పెట్టబోవుచున్నారా? మీవలె నాకు డబ్బుమీద భ్రమలేదు. పొమ్ము. మీరు లక్షరూపాయల నిచ్చినను నేను రాజాలను. ఇంకొకరియొద్దకు వెళ్లుడు." అనెను.

గోవిందరాజులుగారు పైకమును మరల తన జేబునందుంచుకొని వెడలిపోయెను.

గోవిందరాజులు వెళ్లిన యనంతరము డాక్టరు గారి భార్య ఆయనయొద్దకువచ్చి "మీరు చాల అలసియున్నారు.

డాక్టరు గారామెను లేవదీసి సంగతిసందర్భములను గనుగొనెను. ఆమె ఆనాడు జరిగిన సంగతులన్నిటిని పూస గ్రుచ్చినటులు ఆయనకు నివేదించెను.

"వారిచ్చట త్రాగినారా? ఏమందై యుండును?"

"మీ ఔషధముల గదిలో వారున్నపుడు ఫ్రాన్సు దేశములోని సారాయ మనుకొని యొకబుడ్డిని దెరచి అయిదారుబొట్లులను నోటిలో వేసికొనినారని జవాను చెప్పుచున్నాడు."

"ఆఁ. సారాయమువలె నున్నదా? ఒక్క నిమిష మాగండి" అని చికిత్సాలయములోనికి వెళ్లి కొంతసేపటికి మరలివచ్చెను.

"ఎంతపని జరిగినదండీ! అది విషమండీ అమ్మాయిగారూ! మీరిచ్చటనే యుండండి. నేనావారిని చూచి ఇప్పుడేవచ్చెదను" అని కొన్నిమందులను తన వెంటదీసికొని ఠాణాకు వెళ్లెను.

నాటిరాత్రియంతయు డాక్టరుగారు ఠాణాలోనె యుండి రోగికి ఉపచర్యచేసెను. తెల్లవారుజామునకు, రామలింగము గారు తేరుకొని, ఇటునటు తిరుగ నారంభించెను.

## తుదిమాట

పాఠకమహాశయులార! మనకథ నింకను పెంచి, మీకు శ్రమయిచ్చుట నా కేమాత్రమును నిష్టములేదు. తరువాత జరిగిన సంగతులను ఒకటి రెండు మాటలతో ముగించుటకు ప్రయత్నించెదను.

కాక్సుదొరగారి కేసువిచారణ ప్రారంభ మయ్యెను. ముద్దాయీలతరఫున, సాక్ష్యము నేమాత్రము వినకయే, జాయింటు మేజస్ట్రీటుగారు రెండుదినములలోనే విచారణనుపూర్తిచేసి డాక్టరుగారి కుమారులను, మరి ఇద్దఱు ముగ్గురను విడిచిపెట్టి తక్కినవారి కందఱికి కఠినశిక్షను విధించి కృతకృత్యు లైరని మాత్ర మిచ్చుట సూచించిన జాలును.

గ్రంథకర్తగారు రచించిన

# ఇతర గ్రంథములు

1. రాజ్యతంత్రము (జాతీయ విద్యాభివర్ధక సంఘము వారిచే ప్రకటింపబడును. ఒకమాసము లోపుగ వెలువడును.)

2. పాశ్చాత్య రాజ్యాంగతంత్రము (యుద్ధానంతరమున పాశ్చాత్యఖండములో సంస్థాపింపబడిన క్రొత్త ప్రభుత్వముల చరిత్రము. త్వరలో వెలువడును.)

3. ఆంధ్రుల రాజనీతి (ఆంధ్రులు ప్రాచీనకాలము నుండియు, ఇతర ప్రాంతవాసులతో పాటు రాజ్యతంత్ర నిపుణతలో చూపిన శక్తిసామర్థ్యములు ఇందు వర్ణింపబడి యున్నవి. గుజరాతు విద్యాపీఠమువారి ఎం. ఏ., పరీక్షకు, ప్రబంధముగా (Thesis) సమర్పింపబడినది. త్వరలో వెలువడును.)

పై గ్రంథములమీాద వచ్చు సొమ్మంతయు జాతీయ ప్రతిష్ఠాలయముల పోషణార్థమై వినియోగింపబడును.

# విద్యాభిక్షము పెట్టుడు

## రాజ్యతంత్రము
## (POLITICAL SCIENCE)

పాశ్చాత్యులవలెనె, భారతీయులు సైతము అనాదినుండియు రాజనీతి యందు శేముషీధురీణులై విలసిల్లినారని సప్రమాణకముగ చూపెట్టుచు డాక్టరు అనిబిసెంటుగారు కొంతకాలముక్రింద, జాతీయవిశ్వవిద్యాలయము నందలి పట్టభద్రు   చ్చిన యుపన్యాసముల ననుసరించి,

అడయారు జాతీయ విద్యాలయమునందలి చరిత్రోపాధ్యాయులు సాహిత్యసర్వస్వాములు నగు శ్రీయుత కె. ఎన్. శర్మ, బి. ఏ., బి. టి. గారు, ఆంధ్రమున, తేటతెలుగున వ్రాసియున్నారు.

గ్రంథము, రాష్ట్ర, గ్రామ, ప్రభుత్వ పరిణామము లని మూడుభాగములుగ విభజింపబడెను. సందర్భానుసారముగ, ఆంధ్రులు, ఇతర దేశీయులతోపాటు రాజ్యాంగతంత్ర విద్యకుచేసిన సేవ ప్రస్తావింపబడియున్నది.

రాజనీతిని గూర్చి తెలుగున వ్రాయబడిన గ్రంథములలో నిదియే మొదటిదని చెప్పవచ్చును.

200 పుటలకు పైగ రాయలు సైజున నుండును. వెల ఒక రూపాయకు మించదు.

ఈ గ్రంథముమీద వచ్చు సొమ్మంతయు జాతీయ విద్యాలయముల పోషణార్థము వినియోగింపబడును.

పుస్తకములకు ఇప్పటినుండియే ఆర్డరు నీయవచ్చును.

**థియసాఫికలు పబ్లిషింగు హౌస్, (T. P. H.)**

**అడయారు, మద్రాసు.**

# జాతీయ విద్యాలయము

## (సాశ్రమము)

## అడయారు, మద్రాసు.

ప్రపంచమంతటను క్రొత్త క్రొత్త మార్పులు గలుగుచున్నవి. అన్నిదేశములవారు తమ తమ దేశములను కలవరపెట్టుచున్న రాజ్యాంగ, ఆర్థిక, సాంఘిక సమస్యలను విజయవంతముగ పరిష్కరించుకొని, ఇకముందైనను, సాధ్యమైనంతవరకు, పోరాటములలో జోక్యము పుచ్చుకొనక, శాంతవంతముగ నుండుటకు ప్రయత్నించుచున్నారు. పాశ్చాత్యఖండములలో ప్రస్తుతము సంభవించుచున్న రాజ్యాంగపరిణామమును చూచుచున్నవారికీ విషయమును దెలుపుట అప్రస్తుతము గదా!

ఈ కాలపు బాల, బాలికలే భావి ప్రపంచ రాజ్యాంగ, సాంఘిక వ్యవహారములను పరిష్కరింపవలసియున్నది. ముందు ముందు భావిపరిస్థితు లేవిధముగ నుండునో, మన మిప్పుడు యువకబృందమున కిచ్చుచుండు విద్యావిధానమును బట్టియే, నిర్ణయింపవలసియున్నది. మానసిక, విద్యాశాస్త్రములలో అఖండ పాండిత్యము సంపాదించినట్టివారి యాజమాన్యముక్రిందనే, మన కుఱ్ఱవాండ్రను శిక్షణ సేయవలయును. శరీర, మానసిక, నైతిక విషయములలో కుఱ్ఱవాండ్రు తగిన విధముగ అభివృద్ధికి వచ్చుటకు అన్నివిధముల అవకాశముల నిచ్చుచుండవలయును. అవి యివి యననేల, మన కుఱ్ఱవాండ్రు పెద్దవారై, మాతృదేశ

సేవారాధనమునకు, ప్రపంచసేవకు, అత్యుత్సాహముతో ముందంజవేయుచు, కీర్తిమంతులై యుండుటకు గావలసిన శిక్షణనంతయు నిచ్చు భారము మనపై గలదు. రాజ్యాంగపునర్నిర్మాణమునకు పూనుకొనుచున్న అన్నిదేశముల వారును, ఈ విషయమునకు తగిన ప్రాముఖ్యము నిచ్చుచు, కృతకృత్యు లగుచున్నారు.

ఈ విషయమున మన దేశపరిస్థితులు చాల విచారకరముగ నున్నవి. రాత్రింబగళ్లు, ఎట్టి శరీరవిశ్రాంతియు లేనట్టి విద్యను గరపుచు, వారి ఆయురారోగ్యములను చెడగొట్టుచున్నాము. సతతము పాఠములను కంఠోపాటము చేయుట తప్ప ప్రపంచవిషయము లెట్టివో మన కుఱ్ఱవాండ్రకు చాలవరకు తెలియవు. మాతృసేవారాధనయన్న ఏమిటో వారికి తెలియజెప్పినవారము కాము.

ఇప్పుడిప్పుడీ లోపములను నివారణచేయుటకు కొంతమంది మహనీయులు ప్రయత్నించుచున్నారు. వారికి ఎంతయు కృతజ్ఞులము. వీరిలో ప్రముఖులు జాతీయవిద్యాసంఘమువా రని చెప్పవచ్చును. వీరు చెన్నపట్టణమునకు సమీపమున సముద్రతీరమున జాతీయ సాశ్రమ విద్యాలయ మొకటి సంస్థాపించియున్నారు. ఉపాధ్యాయులు కుఱ్ఱవాండ్రతో సతతము కలసిమెలసి, విద్యాధర్మములను కార్యరూపమున బెట్టుటకు ఇచ్చట చేయుచున్న ప్రయత్నము లిన్నిన్ని యని వర్ణింపదగనుగాదు. భారతవిద్యాదర్శములు చిరస్థాయిగ వర్ధిల్లి భారతోద్ధారణమునకు ముఖ్యాంగములై యుండవలయునన్న, ఉపాధ్యాయుల స్వార్థత్యాగము అత్యవసరము. ఈ పవిత్రాదర్శము ఈ మహావిద్యాలయమున గాంచగలము. విదేశములలో నిచ్చట గొప్పగొప్పపరీక్షలలో నారి తేరి, ఇతరచోట్ల గొప్పగొప్ప ఉద్యోగములను బడసి ధనము గడించుటకు అవకాశమున్నను, ఈ విద్యాలయపు ఉపాధ్యాయులు ఆ యాశలను తృణప్రాయముగ చూచుచు, తమ వ్యయములకు మాత్రము కొద్దిగ సొమ్మును పుచ్చుకొనుచు సేవచేయుచున్నారు. ఇట్టి స్వార్థత్యాగులు గల ఆశ్రమములే పరమపావనములు.

ఇచ్చటి విద్యార్థులు స్కూలుఫైనలు, మెట్రిక్యులేషను పరీక్షలకు వెళ్లుటకు, ఎట్టి నిర్బంధములు లేకనే, ప్రభుత్వమువారు అవకాశముల నిచ్చి యున్నారు. విద్యాలయమువారికే విద్యావిధానమును నిర్ణయించుకొనుటకు అవకాశము గలదు. కుర్రవానికి భోజనమజ్జనాదులకు, విద్యాభ్యాసమునకు ప్రతిమాసము రూ 20 లకు మించదు. చిన్ని చిన్ని కుర్రవాండ్రు సైతము విద్యార్థిభవనమున నివసించుటకు ఏర్పాట్లు చేయబడి యున్నవి.

దేశీయుల ప్రోత్సాహము తగినంత యున్న, విద్యాలయమువారు, తమ ఆదర్శములను ఇంకను విజయవంతముగ కొనసాగించుటకు సంసిద్ధులై యున్నారు. తమకు తోచిన సహాయము విద్యాలయమునకు చేయ నెంచిన మహానీయులు విద్యాలయ ప్రధానోపాధ్యాయులగు జి. వి. సుబ్బారావుపంతులు ఎం. ఏ. గారితో (అడయారు, మద్రాసు) ఉత్తరప్రత్యుత్తరములు జరుపుకొన ప్రార్థితులు.

# అమృతాంజనము

## వాయునొప్పులకు పరమామృతము




నెత్తిబిగును మూత్రామ్లజము మొదలగు చెడుపదార్థములు చేరి యవి సంధిబాధనను లాగు నిలిచియుండుటవలన సంధివాతి మేర్పడు చున్నది. [illegible] వాచుట, జ్వరము, [illegible] బొంగు మొదలగునవి [illegible] లక్షణములు. బాధ గలిగిన వెంటనే రోగికి విశ్రాంతి నిచ్చుట యవసరము. వాయునొప్పుల కుపయోగించు మందులు దీని [illegible] పనును. తలనొప్పి తక్షణము మాన్పును.

వెల డబ్బి 1-కి అణాలు 0—10—0 మాత్రమే.

# తామర తైలము

తామర, తీట, [illegible] మొదలగువానికి మంచిమందు

రాజా రాణీ గుర్తు గల డబ్బి 1-కి అణాలు 6 మాత్రమే

# మోహిని తైలము

స్త్రీపురుషులు వాడుటకు సర్వసామాన్యమైనది

6 తులముల సీసా 1-కి అణాలు 12 మాత్రమే

# పండ్లపొడి

పండ్లపోటుకు తీపులకు మంచిపొడుము, సువాసన గలది

చక్కని డబ్బి 1-కి అణాలు 2 మాత్రమే

# అమృతాంజనము డిపో,

బొంబయి — *** — మద్రాసు

దురంతమా?

(ఒక చిన్న సాంఘిక నవల)

వి. ఎస్. శర్మ. బి.ఏ. బి.టి